# హరిజన నాటకము



పున్నవ లక్ష్మీనారాయణగారిచే

రచింపబడినది

1933

వెల 0—1—0

# హరిజన నాటకము.



(అర్చకుడు—ధర్మకర్త సుబ్బారెడ్డి ప్రవేశం.)

రెడ్డి:— ఓస్వామి! ఇదేమి కలి కాలమండి.

## పాట

శంకరాభరణం—చతుశ్రగతి—ఏక.

మాలకన్నడు – చాకలి చందడు–మంగలి మంచెన్న
జట్టుగట్టుకొని – సేవజేతురట – చన్నకేశవులకు
కులకట్లిప్పుడు – వీరలందరు – కూలద్రోతురంట
మొదటవిజేసిన – వారికంటెను – మొనగాంఢ్లీరంట
బ్రహ్మనాయుడీ – మాలగుంపులకు – పట్టుకొమ్మయంట
సేనలు – పెట్టె పోరునంట
గుడిలో – కొట్టిదూరునంట
మనలను – నెట్టివేయునంట
సాములు మీరే – శ్రద్ధదీసుకొని – సరిపెడుదురు రండి. ౧

అర్చ:— ఇవ్వేళ గుళ్లో మీసేవేనా?

రెడ్డి:— ఇం కేమిసేవ స్వామీ అన్నీ అంతానికి వచ్చినవి. కలి యుగం ముంచక వస్తున్నది.

అర్చ:— ఆగోలేమిటి?

రెడ్డి:— యింకా మీకు తెలియదూ? మాలగుంపు వూరే గుతూ గుళ్లోకి పాడుకుంటూ పోతున్నదదుగో.

(హరిజనులు ఊరేగింపుతో ప్రవేశం)

విడుదలో – విడుదలో – విడుదలో – విడుదలో

అ ను ప ల్ల వి.

అందరూను ఆంధ్రులో – అందరూను ఆర్యులో.

౧. మాలలకును – మాదిగలకు – ఎరుకలేనాదులకును
ఆదిమాంధ్రులైన – వారికందరికిని విడుదలో
విడుదలో – విడుదలో – విడుదలో – విడుదలో.

౨. తాగనీళ్ల బావులూ – తానమాడ చెరువులూ
చాపకూళ్ల సత్రమూలు – సామివారి పూజలు – విడుదలో.

౩. అందరెమ్మ పాలుయిచ్చె – అందరెయ్య బువ్వబెట్టె
కల్లబొల్లి భేదములకు – కారణముల చెల్పరో – విడుదలో.

౪. కట్టెలన్ని మట్టివాయె – కట్టెంగోది దేవుడాయె
కట్టె కట్టెనడుమ మనకు – వట్టి భేదమెట్టనో – విడుదలో.

౫. నీవునేను నీళ్లసప్పా – చెట్టుపుట్ట గట్టుమిట్ట
చేపజెల్ల దేవుళ్లైతె – చెప్పరాని చెనడురో – విడుదలో.

౬. అంటరాని దేవుడంట – అంటవచ్చె దేవుడంట
చదువుకున్న వాళ్లకంటె – చాకలోళ్లె మేలురో – విడుదలో.

౭. అందరి నోట్ట ప్రొద్దుబొడిచె – అందరి నోట్ట ప్రొద్దుగూకె
ఎల్లవారికంటె నీవు – ఎక్కువేల చెప్పరో – విడుదలో.

౮. నిన్నుగొడితె పాలుగారి – నన్నుగొడితె నీళ్లుగారి
గొప్పకొద్ది రకములిందు కలవా లేవో, చెప్పరో – విడుదలో.

౯. ముప్పది కోట్ల దేవతలతో – ముచ్చటైన పుణ్యభూమి
బానిసత్వ మనెడు పాడుపంటలేల పండురో – విడుదలో.

అర్చకుడు—అయ్యో - అయ్యో - మాలగుంపే పాటలు పాడు
తూ వచ్చిపడుతున్నది.

అర్చ:— మాదిగ మల్లిగ-కుమ్మరి తేర్కుడు-మంగలి మంచెన్న
పాపమప్పుడే - కలియుగ మంతట - పండిపోయెనటర
తోళ్లగాబులో - దేవుని ముంచి తోలిచి పెడుతువటర
తోళ్లకంపుతో - చిన్నకృష్ణునికి - దూప మేతువటర
ఆనము - బెట్టి కాల్తువటర
మాంసము - బెట్టి పోత్రితువటర
పొదిలో - బెట్టి యూతువటర
చన్నకృష్ణుడీ - పూజలకెల్ల - సమ్మతించు నటర?

కుమ్మరి తేర్కుడు:—
చన్నకృష్ణుడు - త్రిప్పుచుండు తన - సారెను యెల్లపుడు
చిత్రిచిత్రముగ - ఘటములనెల్ల - చేస్తువుండు నెపుడు
ఆగ్గిబుగ్గితో - అతని ఆనము - ఆరిపోవదెపుడు
పాతకుండలను - పోగుజేసి మఱి - పగులగొట్టు నతడు
[illegible]ల - గౌరవింప డతడు
[illegible]ల - గొప్పసేయు నెపుడు
పాపము - పరిహరించుతాడు
పెద్ద కుమ్మరెని చన్న కేశవుడు - పేరు బొందినాడు. ౩.

పెద్ద సెట్టి:—
గుళ్లు గోపురాల్ గట్టి దేవునికి - కొలువుసేయ గలరా?
రత్నకిరీటము బెట్టి కేశవుని - రంజింపం గలరా
అమ్మవారికి పైడి కంటెలను - అర్పించం గలరా
యేమిబెట్టనిది దేవుడు మీకు - యెట్లు కండ్లబడురా

వ్రూరికె - వచ్చి దూకు నటరా
కోరికె - లిచ్చి పోవునటరా
ఆశల - కంతువుండ దటరా
చిలుము వదలినిది-యెవ్వడికైనను-ఛిద్రము బోనటరా. ర

బ్రిహ్మానాయుడు :—
వేదనాదుల భేదమెరుంగని - పెద్ద ప్రభువతండు
చన్నకేశవుని సాన్నిధ్యంబున - సతత ముండ గనుడు
చిన్నికృష్ణుని చరణసేవనె - సేయుచుండు దెవుడు
చన్నకృష్ణుని చక్కదనంబును - సందర్శింపగ రండు
ముద్దుకృష్ణుని మురళీనాదము - మోగుచుండు వినుడు
తలచిన - తలపు లెరుగు నతడు
పిలువక - పలుకరించు వాడు
పేదల - పెద్దజేయు ఘనుడు
పండిత పామర భేదంబులను - పాటింపనివాడు. వే.

కన్నడు :— ఆహా! నా హృదయం పొంగి పోతుంది. ఏడీ చన్న కేశవుడు? సేవించంది నే వుండలేను.

బ్రాహ్మణుడు :— ఎట్లా సేవిస్తావు?

క :— వెళ్ళి ఆలింగనం చేసుకుంటా. అంతటితో నా తాపము ఆరిపోంతుది. అయ్యో నే భరించలేను?

బ్రా :— జన్మానాస్నానం జెయ్యని యీ మురికి శరీరంతో నేనా, నీవు ఆలింగనం జెయ్యడం. చన్నకేశవుడు మైల బడడూ?

కన్నడు :— మైల పడతాడా, అయ్యో! మరెట్లా. దూరంగా

వుండి రెండు పూలు ఆయన పాదలముమీంద బెట్టి చిన్నంగా వత్తుతా.

బ్రా :— నీ చేతు లింకా తోళ్ళకంపు కొడుతునే వున్నవి. వాటితోనే అంటుకుంటావు ?

క :— స్వామి సన్నిధిలో ఆయన వినేటట్టుగా కీర్తనలయినా పాడుకుంటా.

బ్రా :— బ్రాహ్మణుల నోటవచ్చే సామగానాలు వినేవాడు నీ బొల్లిపాటలు వినవచ్చాడా ?

క :— అయ్యో, వినడా, మఱి నాగతేమి? పోనీ ఎదటికి పోయి కండ్లతో నయినా చూస్తా. ఆరూపం కండ్లతో జూచి ఆనందిస్తా.

బ్రా :— బ్రాహ్మలు, కోమట్లు పట్టుబట్టలతో ఆలయం నిండి వున్నారు. ఇది సేవాకాలం.

క :— అయితే నేనేమి జెయ్యను? నిలువలేనే. నాన్నగారు ఏమిమార్గం – నాకు పిచ్చెక్కుతున్నది.

బ్రహ్మనాయుడు :— ఆయన్నే పిలువు, వచ్చి దర్శన మియ్యమని.

క :— కేశవా – తండ్రి – నిన్ను చూడంది నిలువలేను. చన్న కేశవా. అదిగో కేశవుడు, ఆకాశమంతా కేశవుడే, భూమెంతా కేశవుడే, నా వాళ్ళంతా కేశవుడే, నా లోపలంతా కేశవుడే.

—* పాట *—

హిందుస్తాని—ముఖారి—ఆదితాళము.

దర్శన మాయె - సందర్శన మాయె
విశ్వరూపుని - దర్శన మాయె
దర్శన మాయె సందర్శన మాయె వి॥
కేశవాయని - కేక వేయగ
ఏకరూపమున - లోకమంతట
దర్శన మాయె వి॥

బ్రహ్మనాయుడు :— ఆర్యులారా భగవత్కృప వలన కన్నమదాసుకు భగవత్సాక్షాత్కారము గలిగినది. అతడు ధన్యుడు. మనము ఈ సమయముననే మన వీరవైష్ణవ మతముయొక్క ధర్మములను లోకమునకు వెల్లడించి వాటిని ఆచరణలో బెట్టుటకు ప్రయత్నింతాము :— శ్రీమన్నారాయణుని యందు భక్తి గలిగి ఆయన కృపాతిశయముచేత మోక్షమును పొందగలరు. వీర వైష్ణవు లందరు కులబేధములు పాటింపక సమభావముతో వర్తించవలసి యున్నది. దయా సత్య శౌచములు ప్రతిమానవుడు అవలంబించవలయును. ఇవి వీరవైష్ణవ మతము యొక్క ప్రధాన సిద్ధాంతములు.

బ్రాహ్మ :— పంచమాది కులములతో సాహచర్యము అనర్థదాయకము కాదా ?

బ్ర :— అగ్రవర్ణముల వారికంటె పంచము లెక్కువ దుర్మార్గులుగారు, అందుచేత వారితో సాహచర్యము వలన

యేఅనరమును రాదు. ఆరోగ్య విషయమున వారి అలవాట్లు కొన్ని సరిఅయినవి కావు. గాని ఆ విషయమున వారిని బాగుచేయ వలసిన భారము అగ్రివర్ణముల మీాదనే నిలిచి వున్నది. అసహ్యామునకోర్చి శిశువులను తల్లి తండ్రి లేవగింపక ఏ విధమున సాకుతారో అగ్రివర్ణముల వారందరూ శిశుప్రాయులుగా వున్న పంచములను పుత్రి ప్రేమతో ప్రేమించి బాగు చేయుడము ధర్మము. తల్లి దండ్రిలకు శిశువులెట్లు అస్పృశ్యులు గారో పంచములూ అగ్రివర్ణములకు అస్పృశ్యులుగారు. వారిని ప్రేమించి బాగుచేయుట ఉభయులకూ తరుణోపాయమే. మన హృదయముల యందు ప్రేమ వున్నయెడల వారస్పృశ్యులు కావడమునకు మారుగా మన హృదయాలింగమునకే అర్హులవుతారు. ప్రేమ లేక పోవడమే మన భేదములకు కారణము. పండితులు అందరి యందూ సమదర్శనులే. విశ్వదృష్టి గలవాడికి తిరుపతి కొండయొక్క ప్రతి రాతియందూ వెంకటేశ్వర్లే కనబడుతాడు. ఆత్మయొక్క విశ్వమయత్వము గోచరించిన వాడికి ఏ భేదములు కనబడవు. భేదముల కజ్ఞానమే మూలము.

వీరవైష్ణవులలో భోజన ప్రతిభోజనముల కడ్డుండ గూడదు. మీారందరు శంకలు విడిచి నిష్కల్మష హృదయముతో చాపకూడు భుజించి సమభావమును వెల్లడించవలె నని నా కోర్కె.

బ్రా :— భోజన ప్రతిభోజనములకు మీరింత ప్రాముఖ్యమియ్యడ మెందుకు?

బ్రహ్మనాయుడు :— కులభేదములను రక్షించె కంచెగోడలు భోజన ప్రతిభోజన నిషేధములే. శాస్త్రములు కులముల మధ్య అనులోమ ప్రతిలోమ వివాహాము లంగీకరించీ భోజన ప్రతిభోజనములు నిషేధించినవి. అన్యోన్య వివాహాములకంటె భోజన ప్రతిభోజనములె సమభావము గల్గించడమున కెక్కువ తోడ్పడుతవి. కనుక ఈ విభేదమును మీరు ముందు కొట్టివేయవలసి యున్నది.

అందరు :— శ్రీమద్రమారమణ గోవిందో హరి.

బ్ర :— వీరవైష్ణువు లందరు సమానమైన మతహాక్కులు గలిగి వుంటారు. వేదములు పక్షపాతము జూపిన యెడల అవిత్యాజ్యములు. యజ్ఞోపవీతము. అందరును వేసికొనగూడనిచో నా సోదరునికి నిషేధింపబడినది నాకూ బనికిరాదు. సంస్కృతము అందరూ చదువగూడనియెడల అదీ వర్జనీయమే. దీనికి త్రివిధ సన్యాసమని పేరు. సమదర్శన భావమునకు ప్రతిబంధకములయిన యీ మూటిని త్యజించినవాడె వుత్తమ సన్యాసి.

అందరు :— శ్రీమద్రమారమణ గోవిందోహరి.

బ్ర :— అయ్యా! తమరందరు భోజనానికి లేండి.

—* సమాప్తము *—